విస్మృతకవులు        సంపుటము 6.

శ్రీరస్తు

శ్రీ

రావిపాటి త్రిపురాంతకకవి

ప్రణీతమగు

# శ్రీత్రిపురాంతకోదాహరణము

ఇది

వనపర్తి సంస్థానాధీశ్వరులగు

శ్రీ[illegible]

రాజారామేశ్వరరావు

బహిరీబలవంతు మహాభూపాలబహదరువారి

యాజ్ఞానుసారముగా

మా - రామకృష్ణకవిగారిచేఁ

ప్రకటింపఁబడియె.

వనపర్తి

బ్రహ్మవిద్యావిలాసముద్రాక్షరశాలలో

ముద్రింపఁ బడినది.

1912





ఈయుదాహరణ మనుచిన్నకృతి రచించినకవి రావిపాటి త్రిపురాంతకుం డని పెద్దనజగన్నాథకవులలక్షణలక్ష్యగ్రంథములవలనఁ దెలియుచున్నది. ఈత్రిపురాంతకుండే తిప్పరాజు. ఇతని ప్రేమాభిరామ మనువీథిని శ్రీనాథుడు వల్లభరాయని పేరఁ దెనిఁగించియున్నాడు. దానిలో,

ఉ. నన్నయభట్టుతిక్కకవినాయకు లన్న హుళిక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూఁడియమరాధిపు డన్నను సత్కవీశులన్
వెన్నుదుటం గరాంజలులు నింతలు సేయని రావిపాటితి
ప్పన్నయు నంతవాఁడుతగునా యిటుదోసపుమాటలాఁడఁగన్॥

అని నటితో సూత్రధారుండు చెప్పినట్లున్నది. ఇతఁడు రెండవప్రతాపరుద్రుని కాలమువాఁడు. ఇతఁడు శ్రీశైలమునకుఁ దూర్పు వాకిలి యగుత్రిపురాంతకక్షేత్రమున జనించి తద్దేవునకు భక్తుఁడై శృంగారకావ్యములను భక్తిరసప్రధానకృతులను విరచించి ప్రఖ్యాతుఁడయ్యెను. మదనవిజయ మనురతిశాస్త్రము చంద్రతారావళి యనుచంద్రస్తుతియు, అంబికాశతక మనుపార్వతీస్తుతియు, నీయుదాహరణమును, సంస్కృతమునఁ బ్రేమాభిరామ మనువీథియు నిమ్మహాకవికృతములు. వీనిలో మదనవిజయ మెనిమిదాశ్వాసముల సంజ్ఞాభియోగికభార్యాధికార పారదారిక వైశికాది ప్రకరణములు గలిగి యభినవకామసూత్రమో యన విలసిల్లుచున్నది. నాకుఁ జూడఁ దటస్థించినప్రతిలోఁ బూర్వపీఠిక లేదు. మఱియుఁ దాళపత్రములు బాణోచ్ఛిష్టమయి బూజుపట్టి విడదీసినచో సహస్రశకలాకాలము

లందుచుండెను. తద్గ్రంథస్వాము లయ్యది పైత్యకథన మని యీనా ళ్లకుండిరిగాక రెండవమాఱు చూపకయు నుండుట శోచ్యమయ్యెను. దానిలోనుండి రెండుపద్యములు మాత్ర ముదాహరించెదను.

క. సతిగుణవతి యగునేనియుఁ
బతి కది రత్నంబ ప్రాణబంధువ యమృతం
బతివయ దుర్గుణి యగునే
బతి కెడపనిచిచ్చు కాలువక యది కాల్చున్

మ. గుణమున్ సుందరరూపమున్ విభవముం గూటంబు సౌభాగ్యల
క్షణముం జారుచరిత్రమున్ వినయముం జాతుర్యమున్ ధర్మభూ
షణముం గల్గి పతివ్రతామహిమ మించన్ గల్గెనేఁ దత్సతీ
మణి చింతామణి దానిఁ దాల్పఁగలుగన్ మర్త్యుండె ధన్యుం డిలన్

ఈకవి రచించిన చంద్రతారావళి ౨౮ వృత్తములనూతనభాగములుగలది.

మ. చరమక్ష్మాధరచారుసింహముఖదంష్ట్రాకోటియో నాఁగ నం
బరశార్దూలనఖంబో నాఁగఁ దిమిరేభప్రస్ఫురద్గర్వసం
హారణక్రూరతరాంకుశం బనఁగ నుద్యల్లీల మీరేఖని
త్యరుచిం బొల్పగుఁ బెంపగున్ విదియచంద్రా రోహిణీవల్లభా.

మ. అమితధ్వాంతతమాలవల్లి లవనవ్యాపారపారీణదా
త్రమొ సౌగంధికషండకుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రియనిర్వాణధురీణకుంచికయొ నాఁగం బెంపునన్ మీకళా
రమణీయత్వము చూడ నొప్పెసఁగుఁ జంద్రా రోహిణీవల్లభా.

మ. రతినాథుం దనుమాయజోగి చదలం ద్రైలోక్యవశ్యాంజనం

లలితరత్నంబునఁ గూర్చి మౌక్తికమయం బై యున్నపాత్రంబునన్
మృతకం బేర్పడఁ బెట్టి దాఁచె నన మీమధ్యంబునన్ మచ్చ సం
తతముం గన్నులపండువై వెలయుఁ జంద్రా రోహిణీవల్లభా.

అంబికాశతకమునఁ బార్వతీనాయికాగుణవర్ణనాదులు రసజ్ఞులకింపు
గా మృదుభాషతోఁ గూర్పఁబడినవి. నేఁటికాలమున శృంగారస
ముద్రసారవిధురులు గొందఱును భక్తిరసనియమప్రణాళికాపారీణు
లు గొందఱును నుత్తమదేవతావర్ణనముల శృంగారరసభావములు రసా
భాసములుగాఁ దలఁచుచున్నారు. దీనిలో నుత్తమదేవతలైన యం
బికాశివులపరస్పరశృంగారరసోన్నతి వర్ణింపఁబడినదిగాని ధ్వని
కారులమతమున రసాభాస మనునదిమాత్రము దీనిలో నెచ్చటఁ గా
నరాదు. దీనిలోనికొన్నిపద్యములు చదువువారల కింపుగా నుం
డు నని యుదాహరించెదను.

ఉ. భారతివై సరోజభవుపాల వసించి రమావధూటివై
నీరజనాభుఁ జెంది ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరి వరించి తమ్మ నినుఁ గొల్వక యూరక యేల గల్గు సం
సారసుఖంబు లీభువనసంతతికిం దలపోయ నంబికా.

ఉ. చెప్పలబోరుఁదల్పు లిసిటెంతలు వా కొదుచూపుఁగుంచియుం
ద్రిప్పి తళుక్కునం దెలిచి తిన్ననిమోమునఁ గాయువెన్నెలల్
ముప్పిరిగొన్నవేడుకలు మూఁగినసిగ్గసిఱుకాడఁ బ్రీతి నీ
వప్పరమేశుఁ జూచి తను వర్ధముఁ గొంటి పొసంగు నంబికా.

చ. బెడఁగగురత్నదర్పణముఁ బేరినవెన్నెల వోసి నిచ్చలుం

దుముపక పాలసంద్రమునఁ దోఁచి సుధాకరుమేనికందు వోఁ
గడుగక నేరకేటి సితకంజము ముంపక నైజకాంతిచే
తొడరినఁ దల్లి నీమొగముతో సరివోల్పఁగఁజాలు నంబికా.

ఉ. లాచిపరాంగనల్ వరవిలాసమనోహరవిభ్రమంబులన్
జూచినఁ జూడఁ డుత్తముఁడు చూపఱఁ జూచును మధ్యముండు తాఁ
జూచినఁ జూడకుండినను జూచుఁ గనిష్ఠుఁడు నన్నువీరిలోఁ
జూచినఁ జూడకుండుగుణిఁ జూచినచూపునఁ జూడు మంబికా.

ఉ. వాలినకన్ను ముంగురులు వాతెఱకెంపుమెఱుంగుఁ జంటిపై
గ్రాలెడుతారహారమును గంకణచారుకరంబు డాఁపలం
దూలుచు నున్నపయ్యెదయుఁ దోఁచినకన్నులు మోడ్చి మోడ్చి నీ
పా లగునీశుమేనిసగఁబాలు మనంబునఁ జేర్తునంబికా.

ఉ. కూడెడివెంద్రుకల్ నిడుదకూఁకటిఁ బ్రోవఁగ బొడ్డుపై వళుల్
జాడలు!దోపఁ గ్రొమ్మొలక చన్నులు మించు దొలంక సిగ్గునం
జూడఁగ నేరముల్ మెఱుఁగుఁజూపుల నీన హిమాద్రియింట నీ
వాడుట శూలికిన్ మనము వాడుట గాదె తలంప నంబికా.

ఇతఁడు రచించిన ప్రేమాభిరామము నాకు లభించినదికాదు దానిని శ్రీనాథుఁడు క్రీడాభిరామ మనుపేరఁ దెనిఁగించెను అది యతిమనోజ్ఞమై సహృదయాహ్లాదకరమై యున్నది.

ఈయుదాహరణము మహాకావ్యములలోఁ జేరక క్షుద్రప్రబంధములలోనిది. ఇది ప్రథమాదిసప్తవిభక్తులును సంబుద్ధితోఁ గలసి యెనిమిదిభక్తులును బనుపడఁ బద్యములఁ గ్రమముగాఁ గూర్చి యొక్కొకదానిపిదపఁ గళికోత్కళికలను గానయోగ్యము లగుమార్గజాతి

పద్యములఁ జొప్పించి పరిపూర్ణ మగు స్థాయిరసపరిపాకము గలు
గునట్టులు రచింపఁబడును. భాషలోఁ గొన్ని యుదాహరణలే
గలవు. వానిలో నెల్ల నిది మేలయినది. దీనిలోనిపద్యము ల
న్నియు సంస్కృతచ్ఛందస్సంజాత ములగు వృత్తములు. కళికో
త్కలికలలో రగడలును గొన్నినూతనజాతులును గలవు. దాని కిం
ద్రసూర్యచంద్రగణములే ప్రధానములు. పూర్వకాలమున ద్విప
దపదకావ్యములు రగడలు, సీస,గీత్యాటవెలది,తరువోజ,సద్దళి, సద్దళి
లయగ్రాహ్యుత్కళికాదులు చాల వాడుకలో నుండెననియు నన్నె
యాదిమహాకవులప్రౌఢకావ్యములు జనించినతోడనే యవి క్షీణిం
చె ననియు నేను దలఁచుచున్నాను.
నన్నెచోడుఁడుకుమారసంభవమున

౬. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జనసత్యాశ్రయునితొట్టి చాళుక్యనృపుల్ అని చెప్పెను.
దీనిలో మూఁడవనాల్గవచరణములకే నా కిటీవల లభించినప్రతిలో
గునునిలిపి రంధ్రవిషయం
బునజనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్
అనుపాఠాంతరము గానవచ్చుచున్నది.
ఈభిన్నపాఠములయుక్తాయుక్తత స్థలాంతరమునఁ జర్చించెదను.
ఈపద్యమున" మార్గ ,దేశి,,పదములను నాయభిప్రాయమున,, ప్రా
చీన,నవీనరీతు,,లనునర్థము గలవు. నీయర్థమున సంస్కృతకర్ణాటభా

ములలో నీపదములకు బహుప్రయోగములు లభించుచున్నవి.
పూర్వము మార్గ కవిత లోకమున వెలసె ననగా ద్రవిడకర్ణాటములం బ్రాచీనరీతు లగురగడద్విపదాదులే యాంధ్రభాషలోను వెలసె నని యూహించెదను. ద్రవిడమున మణిమేఖల రగడలతో నిండినది. జీవకచింతామణిలో వృత్తములఁ దోఁచినచో నింద్రాదిగణములుఁ గలపద్యము లగపడును. కర్ణాటకమున బహుప్రాచీనకృతి యగుకవిరాజమార్గమునను అక్కఱలు గీతులు విస్తారముగా లభించును. ద్రవిడకర్ణాటాంధ్రభాషలలో మార్గరీతి యింద్రచంద్రాదిగణబద్ధపద్యమయ మైనది. భాషాంతరముల నుండినంతఁ దెనుంగున నుండవలసెనా విభీషణకుంభకర్ణశబ్దములలోనిభకారదము రావణశబ్దమున నుండవలయునా యని కొందఱు వాగ్వైచిత్రిని వెల్లడించెదరు, వినయ మట్లున్నప్పు డుపమానములచేఁ గుయుక్తిసాధనమార్థికులమార్గము కానేరదు. నన్నయకుఁ బూర్వపుశిలాశాసనము లక్కఱతరువోజాదిమార్గపద్యములచే నిండినవి. చూడుఁడు యుద్ధమల్ల పాండరంగాదిశాసనములు. పూర్వ మిట్టిక్షుద్రకావ్యములకుఁ జాలప్రసిద్ధిగలిగియుండెను.
సంస్కృతమున నుదాహరణము లుండె ననుటకుఁ గొన్నినిదర్శనములు గలవు. కాళిదాసు విక్రమోర్వశీయమున "పత్రే నివేశిత ముదాహరణం ప్రియాయా" అనియు రఘువంశమున "జయోదాహరణం బాహ్వోర్గాపయామాస కిన్నరాన్" అని చెప్పియున్నాఁడు విద్యానాథుఁడు క్షుద్రకావ్యలక్షణము సెప్పుచు ఎన కేనాపి తాలేన గద్యపద్యసమన్వితాం జయేత్యుపక్రమంమాలిన్యాదిప్రాసవిచిత్రితం తదుదాహరణం సామ విభక్త్యష్టాంగసంయుతం" అని వ్రాయుచు

న్నాఁడు. ఇట్టి గ్రంథముతో భాషాంతరముల వెనుకగా సం స్కృతమున బాల్కురికి సోమనాథుని బసవోదాహరణమును గర్ణా టకమున నుదాహరణగద్యాదియు లభించెను. ఇదియు వీరశైవ విశిష్ట కృతమే. ఆంధ్రమున నీకృతి గాక యప్పకవి లక్ష్యముగాఁ జూపినదియు శేషార్యోదాహరణ మనునిట్టివలి కృతి యొకటియుఁ గలవు. ఇంక ను బెక్కు లుండవచ్చును. ఆంధ్రమునఁ గలయూఁ డుదాహరణ ములు నొక్కరీతిగా నున్నవి. ప్రాయశః త్రిపురాంతకోదాహ రణమును దక్కిన వనుసరించియుండును.

సోమనాథునియుదాహరణమునఁ గళికోత్కళికలు మాత్రాప్రధాన ములై ప్రాసాంత్యప్రాసములతో నొప్పుచున్నవి ఈపద్యభేదముల న్నియు భరతుని నాట్యశాస్త్రమునఁ జెప్పఁబడినవి భరతుఁడు

గుర్వాది రథ లఘ్వాది ర్యా ష్టేః సర్వాలఘు స్మృతః చతుర్మాత్రాగణా జ్ఞేయాః పూర్వచ్ఛందోవికల్పనాః తతో ధ్రువ కళికాః పాతాః కు ర్యా ల్లఘ్వక్షరేషు చ గుర్వక్షరే తాలగీతపాతాస్తు కళికాస్స్మృతాః

అని చెప్పియున్నాఁడు భారతీయమున నే సీసమునకుఁ బూర్వరూప మగుశీర్షకము రగడకు మాతృకయగురఘుటయు లక్షణలక్ష్యప్ర సంచితములై యున్నవి సోమనాథుండు విభక్త్యంతములఁగూ డ నంత్యప్రాసప్రాసములఁ గూర్చెం గాని యంధ్రభాషాలక్షి త మగుయతిమైత్రిఁ బాటించినవాఁడు కాఁడు.

అతనియుదాహరణగద్యమునుండి కొన్నికళికోత్కళికలు కౌతుక మాత్రముగా నుదాహరించెదను. ప్రథమావిభక్తికిఁ గ్రిందికళిక

అపి చ పురాతననూతనశివగణపాదోదకపవిలసదభిషేకః

తుపితవిపల్లవజగంమలింగసమర్చనని చితవివేకః
సతతవికస్వరభాస్వరనిజముఖమండలఖండితరజనీనాథః
కృతయుగవర్తనకీర్తననిరసనని ప్రుణపవిత్రచరిత్రసనాథః
ప్రకటితదర్పకదర్పకరేణుప్రమథననిశితకరాంకుశహేలః శుకముఖమౌ
నసకమలాకరవిహారణచణరాజమరాళః
ప్వానుభవాంచితకూడలిసంగమసంతతదేవధ్యానాభిజ్ఞః
సూనృతభాషణభూషణవాణీసింహాసనగంభీరరసజ్ఞః

ఉత్కళిక.

శ్రుతిముఖరస్వరసరసనమేత
స్మృతినికురుంబరసాయనగీత
ప్రముదితహృద్వర్తనశితికంఠ
శమదమలాలనగుణితోత్కంఠః

సప్తమీవిభక్తిలోంగళిక.

అపిచాధారసురంగజ్ఞాతిరి
సుపథపథికచిత్సుఖసంధాతరి
వర్గచతుష్టయదాపనశీలిని.
దుర్గనిరసనకరుణాశాలిని.

..........................................................

ఉత్కళిక.

సురగిరిమందర

నిరుపమకంధర
ఘనసారిచందన
వనమయనందన

శేషార్యోదాహరణమున నప్పకవియుదాహరణమునఁ ద్రిపురాంతకో దాహరణమునఁ గళికోత్కళిక లన్నిభంగుల నీసుగా నున్నది దీనిలోనియద్వైతి మార్గమును లభముగాఁ దెనుంగుపదములతో నున్నది. భక్తిప్రధానముగాఁ దెనుగునఁ బెక్కుకృతులు లేవు. దీనిశబ్దార్థమాధుర్యమునకు మెచ్చి చిన్నదైనను నీకృతిరత్నమును బండితులు కంఠాలంకారముగా వహింతురని తాళీదళకాంతారముల. డుమఁ జిక్కినదాని యథాశక్తి దుమ్ము దులిచి లోకమున కిచ్చితిని లేఖకదోషము లింకను జిక్కియుండెనేని బండితులు సంస్కరింతురుగాక. నేను విద్వద్హృదయరంజనమే ముఖ్యోద్దేశముగాన స్వచ్ఛక్తిఁ బరిశీలింపక సంస్కరణక్రియకుఁ జొచ్చినందునకు లోకము క్షమివి డుంగాక.

చెన్నపట్ణం. మాడామకృష్ణకవి





## త్రిపురాంతకోదాహరణము.

శ్రీనగచక్రవర్తితుదిశృంగము చూచెద నంచు నేటికిం
బో ననిశంబు మానవులపుట్టువుఁ జావును లేనిమందు నా
చే ననుచుం బతాక యనుచేఁ జరుణాచల మెక్కి చీరఁ బం
చాననుఁ డిందుమౌళి త్రిపురాంతకదేవుఁడు భక్తలోకముల్.

కలిక

మఱియు సజ్జనభక్తగృహముల మరగితిరిగెడు కామధేనువు
కఱద లెఱుఁగక వేఁడుదీనులఁ గదియుజంగమరత్నసానువు
శైలబాలాముఖచంద్రరోచులచవులఁ దవిలెడునవచకోరము
వేలుపుందపసులతలంపుల వెల్లికొల్పెడునమృతపూరము
దేవతలకు మువ్వురకు నవ్వలిదెస వెలుంగుచునుండు నెక్కటి
భావవీథులఁ గలసి పలుకులఁ బట్టి చెప్పఁగ రానిచక్కటి
ఆఱురేకులమంత్రకుసుమమునందు వెలిఁగెడుచంచరీకము
వేఱుసేయక యోగిజనములు వెదకి పొందెడినూర్ధ్వలోకము ॥

ఉత్కలిక

అడుగుఁదమ్ములఁ జొప్పు వసిగని
యుడరి శునకాకృతులు గైకొని
మీఱి చదువులు దవుల ముందటఁ
బాలుకోడెము నేసిమందట

లాడి తను మార్కొనఁగ వచ్చిన
క్రీడి గోరినవరము లిచ్చిన
యాటవికకులసార్వభౌముఁడు
జూటభాస్వత్తుహినధాముఁడు ॥ ౩ ॥

పద్యము.

ఉ॥ పామును హారముల్, నెలయుఁ బాపటబొట్టును, నేఱు మల్లికా
దామముఁ, దోలు దువ్వలువు, దట్టపుభూతియుఁ జందనంబు, మై
సామునఁ, జాల నందముగ సన్నిధి చేసినఁ జూడఁగంటి నే
నామదిలోఁ గుమారగిరినాథుని శైలసుతాధినాథునిన్ ॥ ౪ ॥

కళిక

మఱియుఁ వేలుపుటేటి మౌళి నాఁగినవాని
నెఱియఁ గన్నుపనోటినీటుఁ దోఁగినవానిఁ
బాలిఁతితో నొక్కొడల బొత్తుగూడినవానిఁ
దలఁకి సేనమరాజుదాఢి కోడినవానిఁ
సాఖ్యతొండనిరాలజడికి నోర్చినవాని
సౌఖ్యతరసాయుజ్యసరణి దీర్చినవాని
వెన్నెలలఁ బురుశించు వెలఁదినవ్వులవాని
వెన్నునకుం నల్లువకును వెనుక దవ్వగువాని ॥ ౫ ॥

ఉత్కళిక

చిగురుగ్రదువు వెఱికి
మ సలుసిగ్గులం నఱికి

పతులఁ బాటులు పఱచి
యతులవ్రతములు చెఱచి
యలులచిలుకలబొంకు
శెలయఁ గొలువఁగ నుండు
మరుజయించినవానిఁ
గరుణ మించినవాని ॥౬॥

పద్యము.

ఉ॥ వాలిగటించుముక్తివరవర్ణినిపయ్యెద కొంగుచాడ్పునం
గ్రాలునిజాంకపుంబడగ గన్నొఁ జూచినఁ జాలు విమ్నగా
స్ఫాలితమాళి చేతఁ బురభంజను చేతఁ గుమారపర్వతేం
శేలెమరాజుచేత ఫలియించు జనావళి కోరుకోర్కెల్ ॥౭॥

కలిక

తుఱియ మట్టిమాద్రిని మొదల పఱఁగి యున్నగురుని చేతఁ
గొఱలి త్రాపసులకు సెఱుకగొలుపుజటిలచరుని చేత
వంబి వసుఁప గుం టెనలకునడచినసదకాని చేత
వంబరాదితత్వములకు నసలయైన శ్రీని చేత
బల్లవాఙ్గవధూటి కాసపడినదుండగీని చేత
వల్లి యలకయేలురాజునసుఁగుసంగడీని చేత
బూతిఁ బూయుమానవులకుఁ బుట్టుమాన్పు వైద్యు చేతఁ
బ్రీతి ధాతపునుకకోఱ భిక్షసేయునాద్యు చేత ॥౮॥

ఉత్కళిక.

ఇల రథంబులీల నొప్ప

సెలున నిగమహరుల ద్రొప్పఁ
బోసఁగఁ బాపనారి గట్టి
పసిఁడికొండ యెక్క వెట్టి
జలధినిద్రవోవుశరము
దొడిగి నేలఁగూలఁబురము
లేసియున్న జోదుచేత
దాసవరగణాద్యచేత ॥౯॥

పద్యము

। ఆఱడియాన నీరసధరాధిపలోకములింద్రు వాకిళుల్
దూఱుట మాని శ్రీనగముతూరుపువాకిలిఁ జొచ్చి పాపముల్
నీఱుగఁ జేసి గంధవతిసీరను గ్రుంకి మనంబులోనిచి
చ్చాఱఁగఁ జేయు టొప్పు త్రిపురాంతకదేవునకై నమస్కృతుల్ ॥౧౦॥

కళిక

మఱియును మెఱయఁగ దిశ లనియెడునునుపుడుఁగులు గట్టినశృంగా
రికినై
కొలిచినదయ బాణాసురు మోసలఁ గూరిమిఁ గాంచినఫణిహారికినై
మేలపుఁజముపులు చదివినవినిమది మెచ్చినలక్ష్మీపతిబావకునై
యాలాపుగలసద్భక్తుల ముక్తికి సేఁగెడుచేరువపెనుతోవకునై
కూటికిఁ గూరకు భక్తులఁ గూరిమిగొనుకులనడిగెడువెడజోగికినై
నేటికి బోటికి నెఁడలను నొడలను నిచ్చినజగదేకత్యాగికినై
హొర్ద్దను రేవెఁగను నేత్రమున్త్రిపొలయుఁగనుంగొనియెడుదేవునకై
నిద్దము లగు పెద్దలాపేరెటులల నెలకొనియెడునిశ్చలభావునకై ॥౧౧॥

ఉత్కళిక

కడుదీనతతో ముదితాపసికై
వడి నింటికిఁ జని వెడకప్పెరకై
కొని యాలిఁ దగని బెనురచ్చలకై
చనుదెం డని నిక్కము సేయుటకై
వెనుద్రిప్పినగుండములోపలఁ గై
కొని చని తనయొప్పటిరూపము కై
కొని గుండయు మెచ్చినవేల్పునకై
వినతిపితామహఫణితల్పనకై ॥౧౨॥

పద్యము

ఉ॥ పోయెడుఁ గాలఁ మన్యగతిఁ బొందదు మోక్షము వెండికొండకుం
బోయెడుత్రోవ మీ కెఱుఁగఁబోవదు మానవులార రండు లేఁ
బ్రాయపుఁగొండకంచు శివభక్తులలోపల నద్రిరాజక
న్యాయుతపుణ్యమూర్తివలనం గడతేఱడు జన్మఖేదముల్

కళిక ॥౧౩॥

మఱియు సకలాశ్రితుల మనుచునర్థమువలన
వఱలుపరమానందవనధితీర్థమువలన
కొమరుమిగిలినమంచుకొండయల్లునివలన
విమతపురదహనకరవిఘ్నఘ్నునివలన
శివభక్తహృదయసంచితనిధానమువలన
వివిధరూపకులలో వెలయుజ్ఞానమువలన
అజ్ఞానఘనతమం బడఁచుదీపమువలన

సుజ్ఞానులకును బోధచూపు రూపమువలన ॥౧౪॥

ఉత్కళిక

తనకిముకలోఁ బుట్టి
కనలిదక్షుని గొట్టి
యసురి వేల్పుల బఱచి
తోడని శ్శ్రీజన్నము చెఱచి
వీరభద్రుఁడు వచ్చి
చేరి మ్రొక్కిన మెచ్చి
యులరునిత్యునివలన
దళితదైత్యునివలన ॥౧౫॥

పద్యము

చ॥ మలజుతోరపుంబునుక కంచము పాదసరోరుహార్చనా
కమలము వారిజోదరునికన్ను కరంబున కాదిభోగిభో
గము రవణంబు చంద్రుఁడు శిఖాకుసుమం బగు నెవ్వరీ డుమార
రమణునకుం గుమారగిరిరాజనివాసున కన్యదైవముల్ ॥౧౬॥

కళిక

మఱియును మెఱయును వేదవాదనుదనకదన సారమునకు
మెఱయువొట్టుముట్టు ముట్టి మేటినీటితీరమునకు
బత్తు లుత్తు లారసి యొరసి పట్టుగట్టి తేజమునకు
సత్తుఁ జిత్తుఁ దాన యైన సత్యనిత్యబీజమునకు
వలచి కొలుచువారిఁ జేరి వలపు దలఁపు దయ్యమునకు
నిలచి నిలచి చూడఁ జూడ నింపియుండు తియ్యమునకు

ఘనులు ఘనులు భోగవీధి మిట్టినట్టిత త్త్వమునకు
ఘనులుఁగనులు నెఱుఁగనట్టిపరమపదమహత్త్వమునకు

ఉత్కలిక ॥౧

కరలి నరలి జూటకోటి
చరలఁ బొదలు సేటిసీటి
కడలఁ గడలఁ జెంది చెంది
జడలు నొడలఁ బొంది పొంది
బాలకేలఁ జూచి జూచి
సోలి కేలఁ గ్రీడలాడు
నాదినాథజనకమునకు
వాదపూరితనకమునకు ॥౧

పద్యము.

ఉ॥ దానవిలోనుగా నొడలివాకిలులంబొడమాపుతీపులన్
దోచి శివాహ్వయానియతితో వెఁ జూచక చూడనేర్చిరన్
లోనవిఁ బోలు నేచవులు లోకము మాడనిచూపులం గనూ
రాచలనాథునందుఁ ద్రిపురాంతకునందుఁ గరంగు చిత్తమా

కలిక ॥౧

మఱియును గటాక్షజితమారునందుఁ
దఱితొడుసామ్యగును దారునందుఁ
బరులలానుభక్తపవసాలునందు
కరుణానుశీతసంకాశునందు
జగములు జనించుతోలుఁజూపెయందు

నిగమార్థముల్ నిలుమనీడయాగుఁ
బొసఁగెల్ల శాంతి యుపపుణ్యునంగుఁ
గడలేని మొఱఁగనరగణ్యుఁడను. ॥౨౦॥

ఉత్కళిక

ఇలయును సలిలంబు
వెలుగు ననిలంబు
దివియు మిత్రుండు
గుణములును హంసు
పరఁగుయా జగాన
పరిపూర్ణుండైన
యప్రతిమునందు
శిష్టతనునందు ॥౨౧॥

పద్యము.

ఉ॥ శ్రీదనుదోయిపై శరముఁ జేర్చి భుజంగమరాజ్యనాహా
మాచల మెక్కడించి నిగమావళియజ్ఞులు వీక్షి పచ్చఁగా
జూచి మొగంబు లిచ్చి దివిజుల్ గొనియాడఁగ నున్ననీరజాం
తాచరణంబు విందుఁ జెవులార గుమారగిరీంద్రమందిరా ॥౨౨॥

కళిక

మఱియు నానామంత్రమణిగణసుధాకల్ప
కొలలు సేనుఁగుమోముకొడుకుఁ గాంచినవేల్ప
మూఁడుమోములపోటుముట్టుఁ బట్టెడుశూర
వేఁడిచూపునఁ దియ్యవిలుతుఁ ద్రుంచినధీర

తాపసులయాలువులఁ దనరుతపములపంట
చూపులకునెల్లఁ బరసుఖవార్ధి పెన్నింట
తిలకాయమానదీపితసుధాసంసూతి
వెలుఁగులకునెల్లఁ దుదివెలుఁగగుపరంజ్యోతి ॥౨

ఉత్కళిక

వినుతముఖనలినము సు
ఘనజఘనపులినమును
వరవళితరంగములు
గురుకుచరథాంగములఁ
గలిగినయుమాసరసి
లలితముఖముల బెరసి
క్రాలునొకకలహంస
బాలచంద్రోత్తంస ॥౨౧

పద్యము

శా. నీ వాద్యుండవు నిన్నుఁ దెల్పుఁ జదువుల్ నీచేత మేలొందు నీ
కై వాక్పూజ లొనర్తు నీవలన బ్రహ్మాండావళుల్ పుట్టు నీ
కే చెల్లున్ సరి యన్యదైవభజనం జేనొల్ల నీయందు మ
ద్భావం బందఁ దగున్ గుమారగిరినాథా చంద్రచూడామణీ ॥౨

సమాప్తము

## లఘుటీక

౧. త్రిపురాంతకము = శ్రీశైలమునకుఁదూర్పువాకిలి
తరుణాచలము = కుమారగిరి

౨. ఎక్కటి = ఏకికుఁడు
ఆఱు రేకులకుసుమము = స్వాధిష్ఠాన మణిపూర కానాహత శుద్ధసహస్రారబ్రహ్మరంధ్రములు అనుషట్చక్రములు. వేఱు సేయః పరబ్రహ్మమునకును డనువను భేద మెంచక

౩. శివకిరాతవేషమున వేదములు శునకాకృతులు గైకొనె.

౪. దువ్వలువు = సన్ననివస్త్రము వలువ ప్రాచీనభాషారూపము.

౫. కన్నప యనుకిరాతుండు శివభక్తుండై తనపుక్కిటనీటితో శివు భిషేకించుట కాళహస్తిమహాత్మ్యకథలోఁ గలదు.
సాక్ష్యతొండఁడు = శాక్యతొండఁ డని యుండుట సరి. శా: మతమున నుండునొకానొక దంపతులకు దొండఁ డనువాఁడు జ: చి శివభక్తుఁడై యూరిసమీపమున నొక్కశివాలయములోనిలిం మునకు ముప్పూటలు పూజసేయుచుండెను. ఒక్కనాడు కుంభీ: తి మగువర్షముచే నాలయముచుట్టును ప్రవాహము వెళ్లి మూఁ దినములు తీయకుండెను. తొండఁ డుపవాస ముండి వెళ్లిజాలం నాలయము చేరిపూజకు తామరపూవు లెక్కడ దొరకకున్నందున శృనెత్తి లింగమునెత్తిపై నుంచెను. శివుండు ప్రత్యక్షమై సాం జ్యమునిచ్చెను.

౬. దక్షిణామూర్తిరూప మగుశివప్రశంస
నంబి — సుందరమూర్తినాయనా రనిద్రవిడమునఁబెద్దయాచార

డొందుఁగ సాటి యంగడికి నూరక తెచ్చితి తెచ్చి యత్తఱిఁ

నిందించినవారిలోన నతనిం గనుఁగొన్నతనంబుఁ జెప్ప తే

మంచుము నీదు పెద్దతనము యిదికొట్టియశంకరేశ్వరా.

కస్తూరిభట్టురాజు

౧౩. శివపాదమును విష్ణువు తనకన్నుల బెజ్జికివైచి పూజించియతనిచే

సుదర్శనము వడసెననుకథ కొమ్మన

శివలీలావిలాసమునగురవ లీలలో నున్నది

రవణము = ఆభరణము.

“పచ్చలు చెక్కినట్టిరవణంబులు వీరకు మారకోటికిన్”

క్రీడాభిరామము

౧౪. ఆదినాథుఁడు = ప్రథమసిద్ధుఁడు – శివుఁడు. రసవాదమును

చిదంబర క్షేత్రమునఁ గొంకణాది మొదలగుసిద్ధులకు

నేర్పెనయవతారము.

దాపపురము = చిదంబరము. పాతపురి యని సాంస్కృతికులును

రసవాదపురమూ రని ద్రావిడులును వ్యుత్పత్తి చెప్పుదురు.

౨౧ శివుని యష్టమూర్తులను జెప్పఁబడెను.

౨౨. త్రిపుర సంహారకాలమునఁ బూనినయంగ

ములయుపసంహారము వర్ణింపఁబడెను.

౨౩ తెగువు = భక్తి

౨ దీనిలో నెనిమిదిపద్యములు గలవు.

సంపూర్ణము.